_*నర్మదా (రేవా)  నది పుష్కరాలు*_
[2024 మే 1 నుంచి మే 12 వరకు]


🙏 _*నర్మదా నదీ ప్రార్థన*_ 🙏



_*స బిందు సింధు సుస్ఖలత్తరంగ భంగ రంజితం*_
_*ద్విషత్సుజాత పాప తాపకారివారిసంయుతం*_
_*కృతాంతదూత కాలభూతభీతిహారి వర్మదే*_
_*త్వదీయ పాద పంకజం నమామి దేవి నర్మదే*_
🪷┈┉━❀🌀❀┉━🪷

🪷 *దేవగురుడైన బృహస్పతి పన్నెండు రాశుల్లోనూ ఏడాదికి ఒకరాశి చొప్పున సంచరిస్తూ ఉంటాడు. ఆయన ఒక రాశి నుంచి మరో రాశిలోనికి మారిన మొదటి పన్నెండు రోజులు పుష్కరాలుగా నిర్ణయిస్తారు♪.*

🪷 *ఒక్కో ఏడాది, ఒక్కోనది చొప్పున భారతదేశంలోని పన్నెండు పవిత్రనదులకు వరుసగా పుష్కరాలు ఉంటాయి♪. ఆ విధంగా ప్రతి

పన్నెండేళ్లకూ ఒకసారి మన నదులకు పుష్కరాలు వస్తుంటాయి♪.*

🪷 *మే 1, 2024 న బృహస్పతి వృషభ రాశిలో ప్రవేశిస్తున్నాడు. ఇది నర్మదా(రేవా) నదికి పుష్కరాల సమయం♪.*

🪷 జీవులను పతనావస్థ నుంచి కాపాడి, పాపాలను తాపాలను తనలో కడిగివేసేది నర్మద♪. తనలో మునకలేసిన వారికి కాలయముని భయం తొలగిపోతుంది అని ఆదిశంకరులు నర్మదావైభవాన్ని కీర్తించారు♪. _*గంగేచ యమునేచైవ..*_ అంటూ మనం ప్రతినిత్యం స్మరించే సప్తనదీ శ్లోకంలో ఐదవ నది నర్మద♪.

🪷 _*క్రోధినామ సంవత్సరంలో 2024 మే 1న అంటే చైత్ర బహుళ అష్టమి బుధవారం మ.1.00 గంటకు దేవగురు బృహస్పతి మేషరాశి నుంచి వృషభరాశిలోకి ప్రవేశించడంతో ముడున్నర కోట్ల తీర్థాలు కలిగిన నర్మదా పుష్కరాలు ప్రారంభమవుతాయి♪.*_

✅👉 _*2024 మే 12న అంటే వైశాఖ శుద్ధ పంచమి ఆదివారం రోజున ముగుస్తాయి. మొత్తం 12 రోజులపాటు నర్మదా నదికి పుష్కరాలు♪.*_

🪷 ఈ సమయంలో పుష్కర సహితుడైన బృహస్పతి, ముక్కోటి దేవతలు, పితృదేవతలు నర్మదానదిలోనే ఉంటారని పురాణ వచనం. అందుకే పుష్కరాల సమయంలో పుణ్యస్నానం కోటిజన్మల పుణ్యఫలమని ప్రతీతి. ఈ పన్నెండు రోజులకాలంలో నర్మదా నదీతీరంలో పుణ్యస్నానాలు, దైవదర్శనాలు, దానాలు, పితృదేవతలకు తర్పణాలు, పిండప్రదానాలు చేయడం సకల శుభకరం.

🪷 మధ్యప్రదేశ్  లోని అమరకంఠక పర్వతంపై ఉద్భవించిన నర్మదా నది.. మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్‌లమీదుగా 1312 కి.మీ పయనించి గుజరాత్‌లోని గల్ఫ్ ఆఫ్ ఖంబాట్ వద్ద సముద్రుడిలో సంగమిస్తుంది.


🙏👉 భారతావనిలో ప్రవహించే ఐదో పెద్ద నది

నర్మద♪. స్కాంద పురాణంలోని రేవాఖండంలో నర్మదా నదీ వైభవాన్ని విస్తారంగా వర్ణించారు. నర్మదకు మరో పేరే రేవా. శివుడి స్వేదబిందువే నర్మదగా మారిందని పురాణగాథ. నర్మదా అనే మాటకు మరణం లేని అని అర్థం. పర్వతాన్ని చీల్చుకుని పెద్ద రవముతో (శబ్దముతో) ఉద్భవించినది గనుక రేవా అని మరో పేరు.

🪷 సమస్త పాపాలు హరించే నర్మదా తీరాన....
🙏👉 అమరకంటక్ (నర్మదా జన్మక్షేత్రం),
🙏👉 ఓంకారేశ్వర్ (ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రం),
🙏👉 మహేశ్వర్ (మహిమాన్విత శివక్షేత్రం),
🙏👉 జబల్పూర్ (చతుష్షష్ఠి యోగిని క్షేత్రం),
🙏👉 భరూచ్ (భృగు మహర్షి - నర్మదా మాత ఆలయాలు),
🙏👉 గరుడేశ్వర్ (స్వామి వాసుదేవానంద సరస్వతి సిద్ధి క్షేత్రం)
తదితర అనేక దివ్యధామాలు అలరారుతున్నాయి.



🙏 *పుష్కరస్నాన విధి* 💐

🪷 పన్నెండేళ్లకోమారు వచ్చే పుష్కరాల్లో మనం పాటించే అన్ని విధుల్లోనూ ప్రత్యేకమైనది *పుణ్యస్నానం.*

🪷నదీదేవతకు ముందుగా నమస్కరించి, సంకల్పం చెప్పుకుని మూడుమునకలు వేస్తూ చేసేదే పుణ్యస్నానం. సంకల్పాన్ని శుద్ధమైన మనసుతో, తేట తెలుగులో కూడా చెప్పుకోవచ్చు.
⊱┈───❀🔯❀───┈⊰

✅ *పుష్కరస్నానానికి వెళ్లినప్పుడు ఏం చేయాలి?* ❓

✅ మీ ఊరి నుంచి బయల్దేరుతున్నప్పుడు దేవుడి గదిలో దీపాలు వెలిగించి, వినాయకునికి నమస్కరించి, పుష్కర యాత్రకు వెళుతున్నామని భగవంతుడి ఆజ్ఞ తీసుకోవాలి.

✅ ఇంటి వద్దే నదీమ తల్లికి అర్పించాల్సిన పసుపు కుంకుమలు, తాంబూలాలు, బ్రాహ్మణులకు

ఇవ్వదల్చుకున్న దాన సామాగ్రి సిద్ధం చేసుకుని వెళ్లాలి. నదీస్నాన సమయంలో పురుషులైతే ధోవతి, పంచె వంటివి, మహిళలైతే చీర, చుడీదార్ వంటి సంప్రదాయ దుస్తులు మాత్రమే ధరించాలి.

✅ *పుష్కరస్నానం చేసిన తర్వాత మాత్రమే క్షేత్రదైవాన్ని దర్శించుకోవాలి.*

꧁┉┅━━❀🔯❀━━┅┉꧂

❌ *పుష్కరస్నానానికి వెళ్లినప్పుడు ఏం చేయకూడదు?* ❌

❌ నదిలో ఉమ్మివేయకూడదు. అది మహాపాపం.

❌ ఇంట్లో స్నానం చేసినట్లుగా నదీస్నానం వేళ సబ్బులు, షాంపూలు వాడకూడదు.

❌ నది నీళ్లతో దుస్తులు ఉతకకూడదు.

❌ పాదరక్షలతో నీళ్లలోకి దిగకూడదు.

❌ వ్యర్థ పదార్థాలు, పనికిరావనుకున్న వస్త్రాలు నీళ్లలో విడవకూడదు.



✅ *పుష్కరదానాలు* ✅

💫 నర్మదా నది పుష్కరాల సమయంలో చేయదగిన దానాల వివరాలివి...

👉 బంగారం, వెండి, ధాన్యం, భూమి.

👉 వస్త్రం, ఉప్పు, రత్నాలు

👉 ఉప్పు, పళ్లు, ఆకుకూరలు, వెండి గుర్రపు ప్రతిమ.

👉 నెయ్యి, నువ్వుల నూనె, పాలు, తేనె, చక్కెర.

👉 ధాన్యం, వాహనం, ఎద్దు, నాగలి.

👉 ఔషధాలు, కర్పూరం, చందనం, కస్తూరి.

👉 ఇల్లు, పీట, మంచం, వాహనం, గృహం.

👉 చందనం, కందమూలాలు, పుష్పమాల.

👉 పిండప్రదానం, 16 రకాల దానాలు.

👉 కూరగాయలు, ముత్యాలహారం, వెండి సాలగ్రామం.